REGD. No. RNL 18 ESTD: 1930 17-5-1991 శుక్రవారం రు. 1-50 ల

# జమీన్‌రైతు



సంపుటి: 62 సంచిక: 20 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరు కోటేంద్రప్రసాద్

# ముఖ్యమంత్రి ఒంటరిపోరాటం

**పార్టీ నాయకుల ప్రకటనలతో కార్యకర్తల్లో నిరుత్సాహం- జిల్లా నాయకుల కీచులాటలతో అభ్యర్థులకు ప్రమాదం- ఓడితే అందరూ నిందించేది ఆయన్నే- గెలిస్తే అందరిలో ఆయనా ఒకడౌతాడు!**

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి జాతక మహిమేమోగాని ఏ వ్యక్తు రు రాజకీయ సమస్యలెదురైనా ఒంటరి పోరాటం చేయవలసివస్తున్నది. జిల్లా స్థాయిలో వున్నప్పటినుంచి ఢిల్లీస్థాయికి ఎదిగినంత వరకు ఆయన ఆయన రాజకీయ చరిత్ర మొత్తం అన్నే నడిచింది; ఇప్పుడు పార్లమెంట్ ఎన్నికల సమయంలోనూ అదే ప్రకారం నడుస్తున్నది.

ముఖ్యమంత్రిగా రాష్ట్రంలో ఎన్నికల బాధ్యత తనపై పడడంలో విశేషమేమీ లేదు. ఏ ముఖ్యమంత్రికైనా తప్పనిసరి కర్తవ్యం అది. పార్టీ గెలిస్తే ప్రతిష్ఠ, ఓడితే అవమానం ముఖ్యమంత్రికే! అయితే ఈసారి ఎన్నికలలో ముఖ్యమంత్రి పరిస్థితి మరింత క్లిష్టంగా తయారైంది.

కాంగ్రెస్ గెలుపుకోసం జనార్దనరెడ్డి ఒక్కరు నానా తిప్పలు పడుతుంటే, తక్కిన నాయకులందరూ తలాఒకపుల్ల అడ్డంవేయడం, ప్రజలలో పార్టీని చులకన చేయడానికితెలిసీతెలియకో తమశక్తి వంచన లేకుండా కృషిచేస్తుండడమే ఈ క్లిష్ట పరిస్థితికి కారణం. కాంగ్రెస్‌కు కాంగ్రెసే శత్రువన్న సామెతను అక్షరాలా రుజువు చేస్తున్నారు నాయకులు.

పాశాలు ఎ ఐ సి సి నాయకుడు శ్రీ రాజీవ్‌గాంధీ నుంచి పిసిసి అధ్యక్షుడు, ఇతర చోటా బడా నాయకుల వెనుకా ముందు ఆలోచించకుండా పార్టీపరిస్థితిపట్ల ప్రభుత్వ పనితీరుపట్ల చేస్తున్న వ్యాఖ్యలు పార్టీ విజయావకాశాలను దెబ్బతీసేవిగా వున్నాయి. ముఖ్యమంత్రి ఒక్కడే గతంలోకంటే పార్టీపరిస్థితి మెరుగ్గావుంటుందని ధీమా వ్యక్తంచేస్తున్నాడు. రాష్ట్ర నాయకులు సృష్టిస్తున్న చీకాకులు చాలవన్నట్లు ఢిల్లీనుంచి పరిశీలకులుగా వచ్చిన పెద్దమనుషులు కాంగ్రెసుపార్టీకి ఇన్ని సీట్లువోతాయి, అన్నిసీట్లు పోతాయి అని నివేదికలు సమర్పించడం, అవి బయటకు పొక్కి పత్రికలకెక్కడంవల్ల కార్యకర్తలలో నీరసభావం చోటుచేసుకుంటున్నది. హైదరాబాద్‌దాటి అడుగు బయటపెట్టకుండా వీరే ఆధారంతో అంచనాలు వేస్తున్నారో, నివేదికలు తయారుచేస్తున్నారో ఆ పరమాత్ముడికే తెలియాలి

* హైదరాబాదు వార్తా కథనం *

ఇంకొక ప్రక్క పి సి సి అధ్యక్షుడి విజయరథయాత్ర పార్టీని బాగా దెబ్బ తీస్తున్నది ఆయన సభలకు జనం రావడం లేదు ఢిల్లీ పెద్దల దయవల్ల పి సి సి పీఠమధిష్ఠించడం తప్ప, ప్రజలకు పరిచితమైన నాయకుడుకాదు హనుమంతరావు రాష్ట్రస్థాయి వ్యవహారం నిర్వహించే స్థాయి లేదు. పై పెచ్చు, పార్టీపై కూడా పెద్దగా పట్టులేదు తన స్థాయి తాను తెలుసుకోకుండా స్వంత వ్యవహారానికి దిగడంవల్ల పేలవమైన సభలతో పార్టీ చులకనై పోతున్నది. ఈ అపకారం చాలదన్నట్లు "కాపులకు తీవ్ర అన్యాయం జరిగింది" వంటి వ్యాఖ్యలు చేస్తున్నాడాయన.

జిల్లాస్థాయిలో నాయకులమధ్య వున్న విభేదాలు ముఖ్యమంత్రికి మరీ తలనొప్పి తెస్తున్నాయి. కర్నూలులో మసాల ఈరన్న పార్టీ పదవులకు తుంగభద్రలో తిలాతర్పణమర్పించారు. నెల్లూరులో నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, ఒంగోలులో రాజమోహనరెడ్డి చేస్తున్న పత్రికా ప్రకటనలు పార్టీని కించపరిచేవిగా వున్నాయి తూర్పుగోదావరి జిల్లాలో శ్రీ ముద్రగడ పద్మనాభం అలిగి కూర్చునివున్నాడు. టిక్కెట్టు రాలేదనే కినుకతో కాపు నాయకులు పార్టీకి పరిమానం కల్గించేరీతిలో మాట్లాడుతున్నారు. తమతమ ప్రాంతాలలో పలుకుబడికల్గిన శ్రీ జలగం వెంగళరావు వంటి నాయకులు ముఖం తిప్పించేశారు.

వీరందరూ పార్టీపట్ల ప్రేమలేనివారు కారు; అయితే తమతమ స్వంత కారణా

—కొరవ 8వ పేజీలో

# ప్రచారం నిర్వీర్యమైనా ప్రజలలో పట్టుపోలేదు!

ఓటమి మరసుగోకి తొంగిచూసి తోవలేనూరలో కరిపెట్టి చెప్పగల విద్యచేర్పడం మానవమాత్రులకి కలిసొచ్చేట్లులేదు. తన దగ్గరకు వచ్చిన వారినందరినీ ఊరించి, బులిపించి, కవ్వించి, ఆకాశపెట్టి నమ్మబలికి, ఆనుమాత్రం బ్యాలెట్ పెట్టెలో తన కిష్టమైన ముద్రగుద్దీ, రాజకీయ నాయకులను అవకాశవాదంలో ఓటర్లు తలదించిపోతున్నారు. నెల్లూరు జిల్లాలోని మూడు నియోజకవర్గాలలో ఎన్నికల ప్రచారం పట్ల ప్రజల ప్రతిస్పందన చూస్తుంటే, ఓటువిలువను, పవిత్రతను, గౌరవాన్ని ఎంత చక్కగా కాపాడుతున్నారా అన్పిస్తున్నది. పోలింగ్‌తేది వారాలనుంచి, రోజుల వ్యవధికి చేరుతున్న తర్వాతకూడా ప్రజలు తమ అభిమతమేమిటో నాయకులకు, పార్టీలకు అంతు చిక్కకుండా కాపాడుకోగల్గడం నిజంగా అభినందనీయమైన విషయం.

నెల్లూరు నియోజకవర్గానికి సంబంధించి ఈ పరిస్థితి మరీ విశదంగా కన్పడుతున్నది. ఎన్నికల ప్రారంభం నాటికున్న వాతావరణం ప్రకారమైతే కుమారి పద్మశ్రీ నామినేషన్ వేసినరోజే పార్లమెంటు సభ్యురాలిగా ఎన్నికైపోయినట్లు లెక్కలో పడిపోవాలి. అనాటికి ఈ నియోజకవర్గంలో బిజెపి ప్రస్తావనేలేదు; తెలుగుదేశం తరఫున సింగంధం పూసుకునే వీరుడెవ్వరూ కన్పడలేదు. కాంగ్రెస్ అభ్యర్థిని వరావే ట్రాఫిక్ రోడ్డుపైన, నల్లేరుమీద బండిపై నడచిన సాగిపోతుందనే అనుకున్నారు. ప్రత్యర్థులకు సిబిఐసి సైతం లేనిదిలో కాంగ్రెసుకు ఓట్లు రాసుకు ఉన్న తోస్తావని అనిరాదు కాని, పోలింగుకు మూడురోజులముందు ఆ పరిస్థితి కన్పించడంలేదు. కాంగ్రెసు నాయకులు నిష్కారపడినా, కష్టపడినా నిజామాత్రం ఇదే.

> సీతమ్మ పేరుతో
> బి. జె. పి.
> ఎంత కుంకుమ
> పంచినా—
> తెలుగుదేశం
> ఎంత గీపెట్టినా—
> నెల్లూరు సీటు
> కాంగ్రెస్‌దే!

ఈ పరిస్థితికి కారణం ఓటర్లుకాదు; ప్రజలుకాదు; ప్రత్యర్థి పార్టీల ప్రభావం కాదు; కాంగ్రెస్‌పట్ల వ్యతిరేకత అసలే కాదు. కేవలం కాంగ్రెస్ నాయకుల అలసత్వం, అశ్రద్ధ, మితిమీరిన ఆత్మవిశ్వాసం కాంగ్రెస్ అభ్యర్థి అఖండ విజయాన్ని మామూలు గెలుపుదశకు దిగజార్చాయి. ముఖ్యమంత్రి స్వంత నియోజకవర్గంగా రాష్ట్రంలో నెల్లూరు సీటుకు ప్రత్యేక ప్రాధాన్యత వుంది. ఇక్కడి గెలుపు ఓటములు ముఖ్యమంత్రి రాజకీయ భవితవ్యాన్ని ప్రభావితం చేస్తాయి. నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కాకిగోంను పెకలెవిన పెద్ది, భూస్వామి క్రింద పాలేరు మాదిరి నాయకుడికి అణగిమణగి వుండడం తప్ప, పార్టీపట్ల ఏమాత్రం విధేయత లేని వ్యక్తిని తప్పించి, విద్యావంతురాలైన యువతిని అభ్యర్థిగా ఎంపిక చేయించడంతో వివాదాస్పద స్థానంగా కూడా మారింది నెల్లూరు.

ఈ ఎన్నికలోని ఈ ప్రత్యేకతలను, సరాళ్ళను జిల్లా కాంగ్రెస్ వాదులెవరూ అర్థం చేసుకున్నట్లు కన్పడదు. అందువల్లనే ఉధృతంగా, ఝుంఝూమారుతంగా వుండవలసిన కాంగ్రెస్ ప్రచారం పేలవంగా, నిస్తేజంగా తయారైపోయింది.

అయితే అదృష్టవశాత్తు నాయకుల అలసత్వం ప్రభావం ప్రచారంపై తప్ప, ప్రజలపైలేదు. తమను ఓటడిగేవారెవరూ లేరన్న అసంతృప్తి, ఎన్నికల రణరంగంలో కాంగ్రెస్ సైనికులెవరూ కన్పించడం లేదన్న కినుకతప్ప, ఓటర్లలో కాంగ్రెస్‌పట్ల సానుకూలవైఖరి ఏమాత్రం మారలేదన్నది స్పష్టంగా కన్పిస్తున్న వాస్తవం. అభ్యర్థిని కుమారి పద్మశ్రీ

—కొరవ 8వ పేజీలో

## పినాకిని తీరం

### పరీక్షాసమయం!

ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డికి ఇది పరీక్షాసమయమే. ముఖ్యమంత్రియై పాలనా వ్యవహారాల్లో అప్పుడప్పుడే స్థిరపడుతున్న తరుణంలో ఎప్పుడైతే పార్లమెంటు మధ్యంతర ఎన్నికలు పిడుగులా వచ్చిపడ్డాయో ఆ క్షణంలోనే ఆయనకు సమస్యలు ప్రారంభమయ్యాయి. పరిపాలన సాఫీగాసాగుతూ, అనతికాలంలో మార్పు తీసుకురాగలిగాడనే మంచి పేరు వ్యాప్తి చెందుతున్న సమయంలో వాతావరణం తల్లక్రిందులుగా మారిపోయింది; రాష్ట్ర వ్యవస్థను ప్రగతిదిశగా సాగిస్తుండిన ముఖ్యమంత్రి దృష్టి అకస్మాత్తుగా పార్లమెంటు అభ్యర్థుల నిర్ణయం, ఎన్నికలకు పార్టీని సిద్ధపరచడం, ఎన్నికల ఏర్పాట్లు, ప్రచారంవైపుకు మరలించవలసి వచ్చింది. దాంతో అంతా అస్తవ్యస్తమైపోయింది. కాంగ్రెస్ వ్యతిరేక రాజకీయశక్తులు, వ్యక్తిగతంగా జనార్దనరెడ్డి విరోధివర్గం ఒక్కసారిగా నలుమూలలనుండి ముట్టడించడానికి అవకాశం కలిగింది.

కాలం కలిసివచ్చినపుడు పరిస్థితులు వాటంతటవి అనుకూలంగా ఎట్లా తోసుకొని వస్తాయో, కలిసిరానపుడు అదే విధంగా ఒకదానికొకటిగా వికటిస్తూవుంటాయి. ఇప్పుడు సరిగ్గా అదేవిధంగా జరుగుతున్నది. నక్సలైట్ సమస్య తీసుకోండి — వారి ఉధృతం తగ్గిందనుకుంటున్న దశలో దామ పుకార్ విజృంభించారు; ఆ విజృంభణ కూడా పరాకాష్ట చేరిగా వుంది. నక్సలైట్లు ఒక శాసన సభ్యుణ్ణి హతమార్చారు; హైదరాబాదు నగరంలో వున్న శాసన సభ్యుడు, మాజీ కేంద్ర మంత్రి శివశంకర్ కుమారుడు శ్రీ సుధీర్ కుమార్‌ను అపహరించుకొనిపోయారు. ఆ అపహరణకూడా ఒక విచిత్రమైన సమయంలో జరిగింది — కాంగ్రెస్ అధ్యక్షుడు రాజీవ్ గాంధీ ఎన్నికల ప్రచారానికి నగరంలో అడుగు పెట్టబోతున్నారనగా జరిగింది కిడ్నాపింగ్ ఎన్నుకోబడిన వ్యక్తి. సమయం ఆలోచన నిర్ణయం పూర్తిగా పీపుల్స్‌వార్ వారిదో, ఇతరులేవైనా కలిశారా తెలియదుగాని, సమయ సందర్భాలనుబట్టి ఎందువల్లనో అనుమానం వ్యక్తమవుతున్నది.

హఠాత్తుగా తోసుకవచ్చిన ఈసంఘటనలే దురదృష్టకరమనుకుంటే రాజీవ్ గాంధీ వ్యాఖ్యలు ఎన్నికల ప్రచారానికి వచ్చిన పార్టీ అధినేత చేయతగినట్లుగా లేవు. రాష్ట్రంలో కాంగ్రెస్ అవకాశాలను గూర్చి రాజీవ్ ఇదివరకు చేసినవ్యాఖ్యే రాష్ట్రంలో కాంగ్రెస్ బలహీనంగావున్నదని ప్రతిపక్షాలు ప్రచారం చేసుకొనుటకు ఆస్కారం కల్గించింది. గతపర్యాయం గెలుపు ఓటములమధ్య ఓట్లతేడా రెండు శాతంలోపేనంట. ఏ కొద్దిమార్పు వచ్చినా ఫలితాలు తారుమారు కావచ్చునని ఆయన వెలిబుచ్చారు. అంటే కాంగ్రెస్‌కు 1989 లో వచ్చినన్ని సీట్లు ఈసారి వచ్చే నమ్మకంలేదని ఆయన అభిప్రాయం. ఆ ప్రకటన వెంటనే ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం సవరణ ఇచ్చింది — గత పర్యాయం ఓట్లతేడా రెండు శాతం కాదు, దాదాపు పదిశాతం అని! కాని రాజీవ్

—కొరవ 10 పేజీలో

# డి కె కాలేజి సొసైటీ స్వాహా

## విద్యాధికులు చేయదగినపనికాదు!

నెల్లూరు డి. కె. మహిళా కాలేజికి చెందిన ఉద్యోగుల సొసైటీలో లక్షలాది రూపాయల స్వాహా జరుగుతూందని కొందరు లెక్చరర్లు ఆరోపిస్తున్నారు. లెక్చరర్లకు ఇళ్ళస్థలాలకోసం 1988 లో ఏర్పడిన సొసైటీ ఇది. రు 8700 లు చెల్లించి అప్పట్లో దాదాపు 80 మంది సభ్యులైనారట. కనుపర్తిపాడు హౌసింగ్ బోర్డు కాలనీ దగ్గర ఐదెకరాల పొలం కూడా కొన్నారు. అయితే సభ్యులకు ప్లాట్లు కేటాయించడం, రిజిస్టరు చేయడం, టౌన్ ప్లానింగ్ అప్రూవల్ తెచ్చుకోవడం వంటి పనులేవీ చేయలేదు. ఈ ఎనిమిదేళ్ళుగా ఎవరిపాటికి వారుండిపోయారు.

ఇప్పుడు, పెడుకొన్న పొలంలో రెండెకరాలు బైపాస్‌రోడ్డు క్రిందకు వచ్చింది. ప్రభుత్వం దానిని సేకరించి, నాలుగున్నర లక్షల నష్టపరిహారం చెల్లించింది. లెక్కప్రకారమైతే 82 మంది సభ్యులకు దానిని సమానంగా పంచాలి కాని, సొసైటీ నిర్వాహకులైన కెమిస్ట్రీ లెక్చరర్ డాక్టర్ పి. మంగేశ్వరరావు ప్లాట్లుకోల్పోయినవారికి మాత్రమే అది చెందుతుందని చెప్పారట. అసలు ప్లాట్ల పంపకమే జరగనప్పుడు, కోల్పోయినవారిని గుర్తించడమెట్లా? లెక్చరర్లందరూ కలిసి ఆందోళనచేసి, కలెక్టర్‌కు విన్నవించి, సొసైటీ సమావేశం జరిపించారట. కాని అందులో వారికి సొసైటీ లెక్కపక్కలేవీ అందలేదు. సభ్యుల సంఖ్య మాత్రం 80 కి పెరిగినట్లు చెప్పారట ఈ కొత్త వారిలో అధికభాగం కాలేజితో ఏ సంబంధంలేనివారు. బైపాస్ రోడ్డు క్రిందకు పోయిన భూమికి సంబంధించిన ప్లాట్లుండేది ఈ కొత్త సభ్యుల పేరిటేనని చెప్పారట. పరిహారంసొమ్ము నాలుగున్నర లక్షలు స్వాహాచేయడానికి జరుగుతున్న

### సింహపురి

డ్రామా ఇది అంటారు లెక్చరర్లు

మొదటకొన్న పొలంకొనుగోలుపైకూడా అనుమానాలున్నాయి. ఎకరంపాతికవేలకు కొన్నామని నిర్వాహకుల వాదం; పదివేలేనని లెక్చరర్ల అనుమానం. సభ్యత్వ రుసుం రెండులక్షలవరకు దండారు. దానికీనాటికీ లెక్కాపక్కాలేదు.

చదువుకున్నవారే ఇట్లా కక్కుర్తికి పాల్పడడం బాగాలేదండీ! ఎవరోవచ్చి విచారణ జరిపేలోగా, నిర్వాహకులే చేసిన తప్పుకు చెంపలేసుకొని, నిజం చెప్పుకొని లెక్చరర్లకు న్యాయంగా రావలసినసొమ్ము పంచిపెడితే మర్యాద నిలుస్తుంది.

### గ్రామోద్యోగుల సంఘానికి అదనపు కార్యవర్గం

నె. జి. గ్రామోద్యోగుల సంఘం సమావేశం 10 తేది పర్మనెంట్ ఫండాఫీసులో జరిగింది. రాష్ట్రసంఘం అధ్యక్షుడు శ్రీ దేవళ్ళ దశరథరామరెడ్డి అధ్యక్షతం దారు జిల్లా కార్యదర్శి శ్రీ గ్రిద్దలూరు రమణయ్య మాట్లాడారు. జిల్లాసంఘానికి ఉపాధ్యక్షుడుగా శ్రీ వి. గోపాల్ (నార్త్ మోపూరు) సహాయ కార్యదర్శిగా శ్రీ కె. నాగేశ్వరరావు (నార్తురాజుపాళెం) నియమితులైనారు. గ్రామోద్యోగులందరూ ఈ ఎన్నికలలో కాంగ్రెస్‌పార్టీకి మద్దతునివ్వాలని కోరుతూ సమావేశం తీర్మానంచేసింది.

### చేనేత కార్మికులకు కాగితాలపై ఇళ్ళస్థలాలు

పీవర్స్‌కాలని, అల్లీపురంలో నివసించే పేద చేనేత కార్మికులు 1979 నుంచి అధికార్ల చుట్టూ తిరిగి, ఇళ్ళస్థలాలు సాధించుకున్నారట. వారందరికీ ఇళ్ళస్థలమిస్తున్నట్లు కాగితాలిచ్చారుకూడా! కాని ఇంతవరకు ప్లాట్లు సర్వేచేయడంకాని, స్వాధీనంచేయడంగాని జరగలేదు.

పన్నెండేళ్ళు పోరాడితే కాగితాలు వచ్చాయి. స్థలాలురావాలంటే ఇంకెన్నేళ్ళు

—కొరవ 11 వ పేజీలో



# తల ఎత్తడానికిలేదు- క్రిందకు చూడడానికిలేదు- రెండుమూడడుగుల ఇరుకుదారిలో కాలినడక!

ఢిల్లీ జనపథ్ లోని ఉత్తరప్రదేశ్ టూరిజం ఆఫీసునుండి మా యాత్ర మొదలయింది బస్ లో మాతోపాటు గైడ్ కూడావున్నారు.

మురాదాబాద్, రామపూర్, రుద్రపూర్, సితార్‌గంజ్, ఖతీమా, టానక్‌పూర్‌ల మీదుగా సుమారు 460 కిలోమీటర్లు ప్రయాణించి సాయంత్రం 7 గంటలకు చంపావత్ చేరాము. ఆరాత్రి ఒక్కో గదిలో 6 లేక 7 మందిమి విశ్రమించాము.

మరసటిరోజు ఉదయం ఫలహారం ముగించుకుని 8 గంటలకు తిరిగి అదే బస్‌లో ప్రయాణం కొనసాగించాము.

హిమాలయ పర్వతాలలో లోహఘాట్ ద్వారా సరయూనది ఒడ్డుననేవున్న గుర్నా అనే ప్రదేశంమీదుగా జిల్లాకేంద్రమయిన పితోరాఘర్‌కు మధ్యాహ్నానికి చేరాము. మధ్యాహ్న భోజనానంతరం కనాలిచిన, ఓగ్లా, అస్కోట్ ద్వారా 170 కి మీ. ప్రయాణంచేసి కాళీనదికి కుడిఒడ్డునవుండే దార్చులా అనే సుందరమైన గ్రామానికి సాయంకాలానికి చేరాము కాళీనదికి ఎడమ ఒడ్డే నేపాల్‌దేశము ఆరాత్రి అక్కడే విశ్రాంతి తీసికున్నాము. ఈ ప్రదేశం సముద్రమట్టానికి 600 మీటర్ల ఎత్తువుంటుంది మూడవనాడు తిరిగి అదే బస్‌లో ఉదయం బయల్దేరి తవాఘాట్ చేరాము. ఈ ప్రదేశం ఎత్తు సుమారు 900 మీటర్లు వుంటుంది. బాగా చలిగా వుంటుంది. అప్పుడప్పుడు వర్షం పడుతుంటుంది. తవాఘాట్ వద్ద ధవళగంగ అనే చిన్ననది కాళీనదిలో కలుస్తుంది. ధవళగంగ నదిని కొయ్యలతో నిర్మించబడిన వంతెన మీద దాటి రెండువేల మీటర్ల ఎత్తయిన పర్వతాన్ని ఎక్కి, అతర్వాత పంగు అనే గ్రామాన్ని చేరాము మధ్యాహ్న భోజనము, రాత్రి విశ్రాంతి అక్కడే.

నాలుగవరోజు ఉదయాన్నే బయలుదేరి ఎనిమిది కి. మీ. దూరంలో ఉన్న సిర్ఖా అనే గ్రామానికి అయిదు గంటలు నడిచి చేరుకున్నాము, అక్కడినుంచి పర్వతాన్ని ఎక్కి 2440 మీటర్ల ఎత్తున్న సోసా గ్రామం చేరి అక్కడి నుండి తిరిగి ఎక్కుతుంటూ తిరలకోట్ చేరుకున్నాము, పంగుకు సిర్ఖాకు మధ్య నారాయణ ఆశ్రమం వుంది.

### హిమాలయాల్లో సాహసయాత్ర (2)

ఆడిటర్
దశరథరామరెడ్డి

ఆశ్రమంలోని లక్ష్మీనారాయణ దైవమూర్తులకు పూజాదికాలు జరుగుతున్నవి. ఇక్కడున్న ఆశ్రమవాసులకు ప్రపంచంతో సంబంధంలేదు.

అయిదవరోజు ఉదయాన్నే బయలుదేరి సిర్ఖానుండి పదిహేను కి. మీ. దూరంలో నున్న జిప్తి అనే గ్రామానికి ప్రయాణం చేశాము దారిలో అడవి, చిన్నచిన్న కొండలు ఎక్కడం, దిగడం సాగించి గల్లా గ్రామం తిందకోటి గ్రామాల గుండా జిప్తి గ్రామంలోని పి. డబ్ల్యు. డి. ఇన్‌స్పెక్షన్ బంగ్లా చేరాము కాళీనది ఇక్కడ తిరిగి కనిపిస్తుంది. ఈ నదికి

—కొరవ 11 వ పేజీలో

### ఉత్తరక్రియలు



మా తాత

**అరుగుంట సుందరరామరెడ్డిగారు**

9-5-91 తేది గురువారం స్వర్గస్థులైరి.

23-5-91 తేది గురువారం

పెద్దకర్మ

నెల్లూరు దండువారి వీధిలోని నా స్వగృహమునందు జరుగును. కావున తెలియజేయడమైనది.

దువ్వూరు సుధాకరరెడ్డి

# నెల్లూరు నాలుగు దిక్కులు

## విశ్లేషకుడు

### ఎండ

ఈ వారంలో ఎండ తీవ్రత అధికంగా వుంది. ఉక్కపోత: రాత్రిపూట ఉక్కగా వున్నది. ఈ వారం శుక్రవారం (17 తేది) ఎండ ఎక్కువ. వారం పగటి గరిష్ఠ ఉష్ణోగ్రత వివరం—

| | |
|---|---|
| 11 తేది | 99.6 ఫా. హీ. |
| 12 ,, | 100.0 ,, |
| 13 ,, | 100.6 ,, |
| 14 ,, | 102.2 ,, |
| 15 ,, | 101.8 ,, |
| 16 ,, | 102.7 ,, |
| 17 ,, | 107 2 ,, |

### ఇప్పుడు ఒకే పార్టీ!

గత పదెనిమిదేళ్ళనుండి ఆనంవారు అందరినుండి అన్నివర్గాలనుండి గురియవు తుండిన విమర్శ— ఒకే ఇంట్లో మూడు పార్టీలని! నిన్నటితో ఆ అపప్రథ తొలగి పోయింది; ఈ వారు అందరిదీ ఒకేపార్టీ— మాట వాట ఒకటేనో కాదో తెలియదు:

మాజీమంత్రి శ్రీ ఆనం రామనారాయణరెడ్డి మొన్న తెలుగుదేశానికి రాజీనామాయిచ్చి నిన్న కాంగ్రెస్‌లో చేరారు. ఏ సి. సాక్షిగా చేరాలనుకున్నారు కానీ 16 రాత్రి ముఖ్యమంత్రి జనార్దనరెడ్డి పూరేగింపు ఆ మార్గంగుండా సాగేట్టు ఏర్పాటు చేయబడి, విగ్రహం వద్దకురాగానే తాను కాంగ్రెసులో చేరుతున్నట్లు సంకేతంగా రామనారాయణ రెడ్డి జనార్దనరెడ్డి మెడలో పూలమాలవేసి దుశాల్వకప్పారు. తర్వాత వి.ఆర్. కాలేజి మైదానంలో జరిగిన బహిరంగసభలో ముఖ్యమంత్రి రామనారాయణరెడ్డిని పిలిచి కాంగ్రెసులో చేర్చుకున్నందుకు గుర్తుగా సరిగంచు అంగవస్త్రాన్ని ఆయనకు దానికి అలంకరించారు ఈపార్టీ మార్పిడి కార్యక్రమాన్ని ముఖ్యమంత్రి తీసుకున్నంత తేలిగ్గా, రామనారాయణరెడ్డి తీసుకున్నట్లు లేదు. ఆ సమయంలో గలగలమని పంతో షంగా వుండవలసినవారు గిలిగిలిగా కనపడ్డారు— ముఖకవళికలు చూస్తే! ఈమార్పు అనూహితమైనదికాదు, అకస్మాత్తుగా జరిగిందికాదు. అందువల్ల ఎవ్వరికీ ఆశ్చర్యం కలగలేదు.

రామనారాయణరెడ్డి చేరికతో ఆనం కుటుంబీకుల కాంగ్రెసు ప్రవేశం పూర్తి అయిపోయింది. 1988 ఎన్నికలతో కాంగ్రెస్‌టిక్కెట్ల నిరాకరణతో ప్రారంభమైన అలక ఈ చేరికతో తీరిపోయింది.

—తరువాయి 8వ పేజీలో





జనసందోహమైన నెల్లూరు కాంగ్రెస్ ఎన్నికల సభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి జనార్దనరెడ్డి

# జనప్రియుడైన జనార్దనుడు!

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి 16 తేది నెల్లూరు పర్యటన కాంగ్రెస్ అభ్యర్థులపాలిట వరప్రసాదమే అయింది. ఆయన పర్యటించిన దారిపొడవునా, ప్రసంగించిన ప్రతి ప్రచారసభలోనూ అపూర్వమైనరీతిలో ప్రజా సమూహాలు ఆయనకు నీరాజనం పట్టాయి. ఒకరాష్ట్ర స్థాయి కాంగ్రెస్ నాయకుడి సభలపట్ల ప్రజలింతగా ప్రతిస్పందించడం విశేషమైన విషయం.

జనార్దనరెడ్డి 16 తేది సాయంత్రం 4 గంటలకు ఉదయగిరికి వచ్చారు. అక్కడ పెద్ద బహిరంగసభ. దారిపొడవునా ఆగుతూ కావలికి చేరేసరికి రాత్రి 8 గంటలైంది. ప్రతి గ్రామంలోనూ ప్రజలు ముఖ్యమంత్రి వాహనాన్ని నిల్పివేశారు. కావలిలోనూ పెద్దసభ. అక్కడి నుంచి నెల్లూరు చేరేసరికి సరిగ్గా పది. వెంకటేశ్వరపురం దగ్గర జిల్లా నాయకులందరూ కలిసి ముఖ్యమంత్రిని నిలేసి, టాప్‌లేని జీప్ ఎక్కించారు. రోడ్డు కిరు ప్రక్కలా చేరిన జనాన్ని తిలకిస్తూ ఏ సి బొమ్మకు చేరింది ముఖ్యమంత్రి కార్లవారు. ఆ సమయానికి ట్రంకురోడ్డు జన సముద్రంగామారిపోయివుండింది. జెకెరెడ్డి, ఆనం వివేకానందరెడ్డి ట్రంకురోడ్డులోని ప్రతియింటినీ విద్యుద్దీపాలతో అలంకరింప చేశారు. రద్దు జిగేల్మనే కటౌట్లు నెలకొల్పారు మిద్దెలమీదనుండి కురుస్తున్న పూలవర్షంలో తడుస్తూ, వింతకాంతులీనే టపాకాయల ప్రేలుళ్ళను చూస్తూ, పూలమాలల బరువును భరిస్తూ జనసముద్రాన్ని ఈదుకుంటూ జీపు వి. ఆర్. హైస్కూలు మైదానం చేరింది. వేమారెడ్డి రామచంద్రారెడ్డి, ఆనం సంజీవరెడ్డి, జె కె రెడ్డి, సి వి శేషారెడ్డి, దేవకుమారరెడ్డి, వివేకానంద రెడ్డి ప్రభృతులంతా జీపులోనే సర్దుకున్నారు. మధ్యలో ఆనం రామనారాయణ రెడ్డి, కె ఎ. సుబ్బారెడ్డి ఆ ఇరుకులోనే సందుచేసుకొని ఎక్కారు.

> అర్థరాత్రి దాటినా
> అడుగు కదపని
> అశేష జనవాహిని
> అపూర్వ ఆదరణ

సభ ప్రారంభమయ్యేసరికి రాత్రి 11 గంటలైనా వి. ఆర్. హైస్కూలులో ఇసకవేస్తే రాలని జనం. సాయంత్రం 6 గంటల నుంచి నిరీక్షిస్తుండినారు వారు. 8 గంటల ప్రాంతంలో సభ జరిగివుండే మైదానం పట్టేదుండేదికాదు.

శ్రీకాకుళం కాంగ్రెస్ నాయకుడు శ్రీ శ్యామలరావు, సినీదర్శకుడు శ్రీ దాసరి నారాయణరావు, ఒంగోలు అభ్యర్థి శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి, నెల్లూరు అభ్యర్థిని కుమారి పద్మశ్రీ మాట్లాడారు. శ్రీ ఆనం సంజీవరెడ్డి సభాధ్యక్షత వహించారు ముఖ్యమంత్రి 40 నిముషాలపాటు సుదీర్ఘప్రసంగం చేశారు ఆనం రామనారాయణరెడ్డి కాంగ్రెస్ ప్రవేశాన్ని ప్రస్తావిస్తూ కాంగ్రెస్‌లోకి ఎవరైనా రావచ్చునని, రాజీవ్‌గాంధీ నేతృత్వంలో దేశాన్ని రక్షించేకృషిలో పాలుపంచుకోవడంలో కావస్వారూప్యతకల్గిన రాజకీయ వాదులందరూ కాంగ్రెస్‌లో చేరాల్సిన సమయమిదని అన్నారాయన. వేదిక మీదున్న కాంగ్రెస్ పెద్దలందరినీ పేరుపేరునా పలకరించి, 'నా మిత్రుడు నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఒక్కడు ఈ వేదికపై లేకపోవడం బాధగా వుంద' న్నారు శ్రీ జనార్దనరెడ్డి; రామనారాయణ రెడ్డ్యాదులను కాంగ్రెస్‌లోకి తెచ్చిన ఆనం సంజీవరెడ్డిగారు నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డిని సైతం కలుపుకొని పనిచేయగల్గివుంటే ఎంత బాగుండేదోనని కూడా చెప్పారు. ఎన్ టి ఆర్ అవకతవక విధా

—తరువాయి 8వ పేజీలో

## జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | రూ. 76-00 |
| ఆరునెలలకు | రూ. 40-00 |
| విడిప్రతి | రూ. 1-50 |








# నెల్లూరు ముచ్చట్లు

(6 వ పేజీ తరువాయి)

శ్రీ వివేకానందరెడ్డి అనర్హత వేటు కాంగ్రెసుకు పెద్ద దెబ్బయిపోయింది. దాదాపు ఎన్నికల్లో వున్న వెంకటరెడ్డిగారికి ఈ ఎన్నికలు సహాయపడ గొల్పుతున్నట్లున్నాయి; కాంగ్రెసు వర్గానికి ఆయన మొదట్లోనే కాదన్నారట. సంజీవరెడ్డిగారు రాజకీయాలతో కొంతకాలం విడ్డూరంగా వుండి ఎన్నికల్లో వ్యతిరేకించినా ఎప్పుడూ పార్టీని వదలిపెట్టలేదు.

శ్రీ ఆనం సంజీవరెడ్డి తదితరులు ఆనం కుటుంబానికి, బంధువర్గ సభ్యులకు వర్తింపచేసిన ఘనచరిత్రం ఇది.

## అర్థరాత్రి అపోలో ప్రారంభం

ముత్తుకూరు రోడ్డులో మూడున్నర కోట్ల ఖర్చుతో నిర్మించిన అత్యాధునిక అపోలో ఆస్పత్రిని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి 8 తేది అర్ధరాత్రి, ఎన్ టి ఆర్ భాషలో చెప్పాలంటే బ్రహ్మముహూర్తంలో ప్రారంభించారు. నిర్ణయమైన కార్యక్రమం ప్రకారం 17 తేది ఉదయం 8 గంటలకు జరగాల్సిన కార్యక్రమం ఇది. అయితే అనుకోకుండా, రాజీవ్ పర్యటన దృష్ట్యా 17 తేది కార్యక్రమాలు రద్దు కావడంతో-ముందురోజు సాయంత్రానికి మార్చారు. నెల్లూరు సభ ఆలస్యంకావడంతో ఆ ముహూర్తంకాస్త అర్ధరాత్రి 12.30 అయింది.

అపోలో నిర్వాహకులు సభకోసం అహ్లాదకరమైన ఏర్పాట్లుచేశారు. వేదికాలంకరణసైతం గంభీరంగా, ముచ్చటగా వుండింది. రిబ్బను కత్తిరింపులుగాగానే సభ. డాక్టర్ ప్రతాప్ సి రెడ్డిగారుమనలోదివారికి నోరు తిరగని ఇంగ్లీషువడంతో ముక్తసరి ప్రసంగం చేశారు. ఆస్పత్రి చైర్మన్ వివో అధినేత శ్రీ పి. ఓబులరెడ్డి అనారోగ్యకారణాలవల్ల సభకు హాజరు కాకపోవడంతో—వారి అధికారి శ్రీ సుబ్బారావు ఆయన ప్రసంగపాఠం చదివారు. సంపద అర్జనకోసం కాక ఆ స్పత్రిలో లాగ స్వామిత్వం స్వీకరించలేదని; సమాజంనుంచి లాభిస్తానికే ఎంతో లాభపడినందువల్ల, అందులో ఏకొంతైనా తిరిగి సమాజపరం చేయాలనే సత్సంకల్పంతో దీనిని చేపట్టానని చెప్పారు శ్రీ ఓబుల్‌రెడ్డి. ఉదాత్తంగా వున్న ఈ ఆశయం ఆచరణలో సఫలీకృతమైతే ఓబులరెడ్డి పేరు జిల్లావాసుల మనసులో చెరగనిముద్రగా నిల్చిపోతుంది.

జనార్దనరెడ్డిగారు అంగ్లంలోనే మాట్లాడారు. సిటీస్కానువంటి అధునిక పరికరాలున్న ఈ ఆస్పత్రిని ప్రజోపకరమైనదిగా తీర్చిదిద్దాలని కోరారాయన. రాష్ట్రంలో సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రుల స్థాపనకు శ్రీ పి. సి. రెడ్డిని ప్రభుత్వ కన్సల్టెంట్‌గా ఉపయోగించుకోంటామని ప్రకటించారు. ఆస్పత్రి మేనేజింగ్ డైరెక్టర్ డాక్టర్ గోపాలరెడ్డి వందనాలర్పించారు. డైరక్టరు శ్రీ కృష్ణమూర్తి, శ్రీ జగదీశ్‌లు జనార్దనరెడ్డికి చందనపు మాలలు వేశారు శ్రీమతి దుర్గల్లత ప్రార్థనాగీతం చాలా కావ్యంగా ఆలపించింది.

## పోయినవి

నెల్లూరు నేతాజీనగర్ నుండి పొదలకూరు రోడ్డుమీదుగా టౌన్‌లోకిస్కూటర్‌పై వస్తుండగా నెల్లూరు బాలాజీనగరు Bit II పంచాయితీ లే అవుట్‌లో 141 నెంబరు ప్లాటుకు సంబంధించిన డాక్యుమెంట్లు పోయినవి. కొన్నవారు కె. విజయశేఖర రెడ్డి. అమ్మినవారు పి. శైలజ

పై డాక్యుమెంట్లు ఎవరికైనా దొరికిన ఎడల సి. ప్రభాకరరెడ్డి ఫోన్ 28689 కు తెలిపినయెడల తగిన పారితోషికం ఇవ్వబడును.

ఇట్లు,

సి. ప్రభాకరరెడ్డి,

నేతాజీనగరు - నెల్లూరు





## జమీన్ రైతుకూ విద్యుత్ శాపం

విద్యుత్‌కోత పుణ్యమా అని ఈ వారం పత్రికను పాఠకులకు సకాలంలో అందించలేకపోయాము. శుక్రవారమంతా మా కార్యాలయంలో కరెంట్ లేదు అటు టౌన్‌హాల్, ఇటు - రాజీధుల్లో మాత్రం లైట్లు వెలుగుతుండినాయి. మధ్యలో వున్న మేము చీకట్లో మగ్గిపోయాం. విద్యుత్‌శాప పీడితులైన మా అశక్తతను పాఠకులు సహృదయంతో అర్థంచేసుకుంటారని ఆశిస్తున్నాము

—సంపాదకుడు

## హనుమంతరావు విజయరథ యాత్ర

పిసిసి నేత శ్రీ వి హనుమంతరావు 16. 17 తేదుల్లో నెల్లూరుజిల్లాలో ఎన్నికల పర్యటన చేసివెళ్ళారు. కావలి, నెల్లూరు, గూడూరు, నాయుడుపేటలలో విజయరథం ఆపి మాట్లాడడంతోపాటు, నెల్లూరులో ప్రెస్ కాన్ఫరెన్సుకూడా పెట్టారు.

హనుమంతరావు సభల గురించి ఎంత తక్కువగా చెప్పుకుంటే అంతమర్యాద!

## యూత్‌కాంగ్రెస్ పదవి

యూత్‌కాంగ్రెసు దక్షిణ ప్రాంతీయ ఎలక్షన్ ప్రచారకమిటీ సభ్యుడుగా శ్రీ కేతిరెడ్డి జగదీశ్వరరెడ్డి నియమితులైనారు. జగదీశ్వరరెడ్డి సౌమ్యుడు. సేవానిరతి కల యువకుడు విద్యార్థిదశనుండి జాతీయ సేవాకార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటున్నవాడు. కొత్తపదవినిపొందిన జగదీశ్వరరెడ్డికి మా శుభాభినందనలు.

కాని ఎన్నికలు పూర్తికావస్తున్న సమయంలో ఈ కమిటీ చేసేపనిఏమిటో ఏముంటుంది? రాగల ఎన్నికలకుకూడా ఇదే కమిటీ వుంటుందేమో!

అయినా యూత్‌కాంగ్రెసులో పంపకం చేయడానికి పదిపాటలేని పోరాటక్షేత్రంలోని పదవులు చాలా వున్నట్లున్నాయి!

## చంద్రమోహన్ దేశం తీర్థ సేవనం

వల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డిగారి మేనల్లుడు, రూరల్ కో ఆపరేటివ్ బ్యాంకు అధ్యక్షుడు శ్రీ బోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి 17 తేది తెలుగుదేశంపార్టీ పునఃప్రవేశం చేశారు. "ఎన్టీ ఆర్ మాత్రమే నిజమైన పేదలపక్షపాతి" అనితెలిసిందట, అజ్ఞానోదయంతో కాంగ్రెస్‌నువిడిచిపెట్టి, తెలుగు తీర్థం సేవించారట. ఏడాదిన్నర క్రితం ఎన్టీ ఆర్‌ను తిట్టినతిట్లు, పెట్టిన శాపనార్థాలు ఇప్పుడు ప్రశంసలుగా మారిపోయాయి

పార్టీ మార్పిడులపై వ్యాఖ్యలు చేయడమంత దండగమారినపని ఇంకొకటుండదు.

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 20 . 2 అ. |
| సర్వేపల్లి .. | 10 . 7 అ. |
| నెల్లూరు చెరువు | 18 . 7 అ. |

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు 9672 (కొత్తవి) | 2000-00 |
| .. 9674 .. | 2200-00 |
| ఐ. ఆర్. 64 | 1900-00 |
| .. 20 | 1800-00 |
| సున్నాలు | 1700-00 |
| మొ॥ బియ్యం 70 కి (పాతవి) | 420-00 |
| .. (కొత్తవి) | 300-00 |
| పెసలు (100 కి) 655 నుండి | 662-00 |

## జనార్దనరెడ్డి

(6 వ పేజీ తరువాయి)

నాంపైనా, నేషనల్ ఫ్రంట్ అస్థిరత పరిస్థితిపైన, బి జె పి ప్రమాదకర ధోరణి పైనా సుదీర్ఘోపన్యాసం చేశారు ముఖ్యమంత్రి. ఆ ప్రసంగం ముగిసేసరికి అర్ధరాత్రి దాటింది. అయినా సభావరణంలో చేరిన వేలాదిప్రజానీకం కాళ్లు నేలకు అతుక్కుపోయినట్లు అడుగు ప్రక్కకు కదపకుండా నిలబడిపోయారు. సభకు జనం రావడం ఒక విశేషమైతే, ఇంత ఓపికగా అన్నిగంటలపాటు నిలబడి ఉపన్యాసాలన్నీ సావధానంగా వినడం, చప్పట్లు, ఈలలద్వారా ప్రతిస్పందించడం ఇంకా పెద్ద విచిత్రం. కాంగ్రెస్ పార్టీపట్ల అనురక్తి వుండకుంటే, ఓటుపై ఒక నిర్ణయానికి రాకుంటే ఈ అపూర్వ సంఘటన తటస్థించటం అసాధ్యం.

నెల్లూరు సభ తర్వాత అపోలో ఆస్పత్రి ప్రారంభోత్సవం జరిపి. భోజనం కూడా మానుకొని నేరుగా రైల్వేస్టేషన్‌కు వెళ్ళిపోయారు. అప్పటికే ఒంటిగంట అయింది. రాజీవ్‌గాంధీ పర్యటన దృష్ట్యా ఆయన రాజమండ్రికి పోవడానికి మెయిల్ ఎక్స్‌ప్రెస్ ఎక్కవలసి వుండింది. అందువల్ల అతిథిభవనంలో చేసిన విందు ఏర్పాట్లు వ్యర్థమైపోయాయి. నెల్లూరు, తిరుపతి సీట్లకు సంబంధించిన ఎమ్మెల్యేలతో జరపవలసిన సమావేశమూ రద్దయింది. స్టేషన్‌మాస్టర్‌గదిలోకూర్చుని అందరితోముక్తసరిగామాట్లాడిరైలెక్కాడు.



# అపోలో హాస్పిటల్-నెల్లూరు
## APOLLO HOSPITAL – NELLORE

భారత దేశంలోనే మొట్టమొదటిసారిగా జిల్లాస్థాయిలో అంతర్జాతీయ ప్రమాణాలతో వెలసిన హాస్పిటల్

- అంతర్జాతీయ ప్రమాణాలకు లోబడిన అధునిక అపరేషన్ థియేటర్లు.
- గుండె జబ్బులకు ఇంటెన్సివ్ కేర్ యూనిట్ మరియు కంప్యూటర్‌సహాయంతో గుండె జబ్బుల నిర్ధారణ పరికరములు
- అల్ట్రా సౌండ్ స్కానింగ్ మరియు ఎకో గుండె పరీక్షలు.
- 24 గంటలూ పనిచేసే అత్యవసర చికిత్సా విభాగము, లేబొరేటరీలు, బ్లడ్ బ్యాంక్. అంబులెన్స్ సదుపాయములు.
- అధునాతన నేత్ర పరీక్ష వైద్య సదుపాయములు
- ప్రత్యేక శిక్షణ పొందిన, నైపుణ్యం కల్గిన నర్సులు మరియు ఇతర ఆస్పత్రి సిబ్బంది అందించే సేవలు
- మరెన్నో ఇతర అధునాతన సదుపాయములు

అపోలో హాస్పిటల్
నెం. 1, బి.వి.ఆర్. నగర్
ముత్తుకూరు రోడ్డు
నెల్లూరు-524 003.
ఫోన్స్ : 26286, 27915

అంతర్జాతీయ ప్రమాణాలలో అత్యాధునిక పరికరములు కలిగి, అన్నివర్గాల ప్రజానీకానికి అందుబాటులో, వైద్యసదుపాయము అందించడానికి, ఈ నెల 16-5-1991 న ప్రారంభం అవుతున్నది. హృద్రోగ విభాగము మరియు అన్ని ఇతర ప్రత్యేక చికిత్స విభాగములలో నిపుణులు మనదేశంలోను, ఇతర దేశాలలోను ప్రతిష్ఠాత్మకమైన వైద్యసంస్థలలో అనుభవము గడించి, మీకు వైద్యసదుపాయాలను 24గం॥ అందించడానికి అందుబాటులో యున్నారు. ఇంతేకాక మద్రాసు మరియు హైదరాబాదు అపోలో ఆస్పత్రుల నుండి ప్రత్యేక నిపుణులు వచ్చి వైద్యసదుపాయము అందించెదరు.



శ్రీ ఎన్. జనార్దనరెడ్డి
ముఖ్యమంత్రి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



శ్రీ పి. ఓబుల్ రెడ్డి
చైర్మన్ అపోలో హాస్పిటల్ నెల్లూరు

ప్రారంభోత్సవం
16-5-1991
సాయంత్రం
8 నుండి 9 గం॥ మధ్య



ప్రారంభకులు
శ్రీ ఎన్. జనార్దనరెడ్డి
ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



# శివారెడ్డి పద్యాలు

### ఎన్నికల కబుర్లు

ఎన్నికల్లో లేవు ఏపార్టీ బి జె పి
ఏపార్టీ తెలుగు ఎర్రజెండా
ప్రచారం సంగతేంటి పార్టీకన్నా, అభ్యర్థి
నూతన క్రొత్త ప్రతిభ మీకు తెలుసు!

నిజము బయటపెడితె విస్మరమౌస్తుంది
ఎవరుగెలిచి తెసెదేమిలేదు
కసికినాకు, ఏదో కల్లాట్లుబడుతుంట
వయసుకొచ్చి ఏదో వాగుతుంట.

కలసిరాక రైము కాంగ్రేసు పడిపోత
దెబ్బతింటె దేశం గబ్బుబట్టె
పోర్టీ నరకకూపమౌర్టి, ఓటర్లార
తెలుసుకొండి నిజము తెరటోక.

మరతు పారిన చక్ల తెరవైంది కాపురి,
ఇందిరమ్మ తాను ఎవరికొరకు
కూకుసీటప్పు మారి కుమిలిండి చెరసాల్లో
ఎవరికొరకు వెచ్చరా పందుకొరకు.

పేదసాద పాలి పెన్నిధానము, రైతు
ప్రగతికెల్ల తాను పట్టుగొమ్మ
కాంగిరేసుపార్టి, కాపదేసువు ఇంది
యాకు, దీన్ని విస్మరింకు నడుక!

### పెళ్ళికళ్ళ

కళ్ళునుసకక, సగము పళ్లాడిపోయ్యాయి
బయటరావాలంటె, భయమదేంటో
లేకపోత ఎగిరిదూకి వచ్చేవాళ్లి
అద్దదాన్న, చెద లద్దూ, లస్కు!

# ఖర్చులో కాంగ్రెస్‌కూడా బి జె పి తో పోటీపడలేకున్నది!

ప్రచారానికి వెళ్ళినప్పుడు ప్రజలనుంచి వస్తున్న ప్రతిస్పందనే దీనికి నిదర్శనం. ఆమె పోయినచోటల్లా సాదరమైనస్వాగతం లభ్యమౌతున్నది. ముఖ్యముఖం తెలియక పోయినా, రాజకీయాలకు పుట్టుకొత్త అయినా, ఉపన్యాసం చెప్పి మెప్పించే నైపుణ్యం లేకపోయినా, ఆమెపట్ల ప్రజలలో సద్భావం వ్యక్తమౌతూనేవున్నది. పార్టీపట్ల మారని అనురక్తి మాత్రమే ఈ ఆదరణకు కారణమన్నది వివాదాతీతమైన విషయం.

తగినన్ని వనరులు, ఆశించినంత ఆర్థిక సహాయం అందక వెనుక ముందు లాలోచిస్తుండిన ఎమ్మెల్యేలు రెండుమూడు రోజులనుంచి వున్నదానితో సరిపెట్టుకొని


**నెల్లూరు సీటు**
(2వ పేజీ తరువాయి)


రంగప్రవేశంచేయడంతో చప్పగావుండిన ప్రచారం వేడందుకున్నది.

నియోజకవర్గాలవారీగా చూస్తే అల్లూరు, నెల్లూరు, సర్వేపల్లి, రాపూరులలో కాంగ్రెస్‌కు అత్యధిక మెజారిటీ వచ్చేఅవకాశంవుంది. సిపిఎం అభ్యర్థిత్వంపుణ్యమా అని అల్లూరులో తెలుగుదేశానికి యాత్రాంగమే లేకుండాపోయింది. సిపిఎం కార్యకర్తలు ఇదివరకటివలె పట్టుతిరిచి పని చేయడంలేదు. నెల్లూరులో జె. కె. రెడ్డి అనం వివేకానందరెడ్డి లిద్దరూ జంటకవులమాదిరి తిరుగుతున్నారు. స్వంత చిలుము వదిలించుకోనైనా కార్యాలయాలు తెరచి నీరసపడివుండిన కార్యకర్తలను ఉత్సాహపరచడంతో నివురుగప్పిన నిప్పు మాదిరివుండిన కాంగ్రెస్‌అభిమానం బయట పడుతున్నది. బిజెపి బలపడుతున్నదనే ప్రచారం జరగడంతో టౌనులోని ముస్లిం ఓటర్లు మొత్తం కాంగ్రెస్‌వైపు నిలబడుతున్నారు. సర్వేపల్లిలో శ్రీ సి. వి. శేషారెడ్డిది ఒంటరిపోరాటం సర్పంచ్‌లు, మండలాధ్యక్షులసహకారం పెంచేసుకొని తనపాటికి తాను పనిచేసుకపోతున్నాడు. నెల్లూరు రూరల్ పరిధిలో చంద్రమోహన రెడ్డి న్యూసెన్స్‌తప్ప, ఆయనకు ఎక్కడా ప్రతిబంధకాలెదురు కావడంలేదు సర్వేపల్లి మెజారిటీ, మిగతా అన్నిటికంటే మిన్నగా వుండేటట్లు చూడాలని ప్రయత్నం-అది సఫలీకృత మయ్యేట్లేవుంది. రాపూరుకూడా పశ్చావే ప్రాప్తిక్యే. అనం వర్గం, నాయుడు అనుచరులు, అంకయ్య

గౌరవం సమస్తం కాంగ్రెసుకే పని చేస్తున్నది చాలా గ్రామాలలో తెలుగు దేశానికి ఏజెంట్ దొరికే పరిస్థితికూడా లేదు

ఆత్మకూరులో బి జె పి ప్రభావం జాస్తిగావుంది తెలుగుదేశం, బి జె పి ల మధ్య ప్రతిపక్షాల ఓట్లు చీలి. కాంగ్రెస్‌కే అధిక్యత రావాలన్నది డాక్టర్ గారి అంచనా; ఆ చీలిక కాంగ్రెస్‌లోనూ వస్తే చెరిసమానమవుతుంది. కోవూరులో కాంగ్రెసు స్వల్ప తేడాతో పైచేయి నిరూపించుకోవచ్చు. గూడూరుదే సమస్య. కోట మండలంలో తప్పకుండా తెలుగు దేశానిదే అధిక్యత; చిల్లకూరు ఆ లోటు పూరించగల్గితే, గూడూరు టౌనులో వచ్చే మెజారిటీతో జనార్ధనరెడ్డి వర్గీయులవరువు నిలుస్తుంది; కచ్చితంగా చెప్పలేము విసంగతి!

ఎందువల్లనో నెల్లూరు సీటుపై బిజెపి అలివిమాలిన ఆశలు పెంచుకుంటున్నది. గెలుస్తామనేనమ్మకంతోడబ్బుసైతం ధారాళంగా ఖర్చు పెడుతున్నారు. అది బలాదుడో, అయోధ్యలోని సీతమ్మ కుంకుమ అని చెప్పేసరికి ఆడవారు ఇళ్లలోనుంచి బయటకువచ్చి దేయిదాపడంతో, అదంతా తమ బలమని మురిసిపోతున్నారు వీరు. గ్రామాలలో రైతు కుటుంబాలకు చెందిన

యువకులు బహిరంగంగా బి జె పి జెండా పట్టుకతో ప్రకటనల్లో వారికి ప్రవేశం దొరుకుతున్నది. విద్యావంతులైన మధ్య తరగతి యువకులలోనూ కొంత మార్పు వుంది. వీటన్నిటివల్లా నాయకులు తమ అభ్యర్థి గెలుపు నమ్మకమనే అభిప్రాయంలో వర్తాను. కాంగ్రెసు ప్రచారం మొదటకాడిగా సాగినన్నినాళ్ళు పరిస్థితి అట్లనే కన్పించింది. కాని ఎమ్మెల్యేలు గ్రామాల్లో తిరగడం మొదలుపెట్టిన తర్వాత వీరి జోరు దానంతటదే తగ్గిపోతున్నది.

అయోధ్య రామాలయం సొమ్ము ఎంత దిగుమతిచేశారోకాని ఖర్చులో కాంగ్రెస్ సైతం బిజెపితో పోటీపడలేకపోతున్నది. వెంకయ్యనాయుడిగారికి ఈ సీటుపై ఎన్నో ఆశలున్నాయి. అవన్నీ అడియాశలు కావడం ఖాయం.

తెలుగుదేశం పరిస్థితే దయనీయం. నెల్లూరులో రమేష్‌రెడ్డి, కోవూరులో పెళ్ళకూరు ప్రభాకరరెడ్డి కోటలో నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి తప్ప వారికి నాయకులున్నవారేలేరు. ఆరాకొరగా వున్నవారు ఒంగోలుకు తరలిపోయారు చంద్రశేఖరం రెడ్డి ఒక్కరూ మొత్తం నియోజకవర్గ బరువు మోయాలి. అదెట్లా సాధ్యం? రమేష్‌రెడ్డికూడా లోపాయికారిగా కాంగ్రెసుకే మొగ్గుచూపుతున్నాడు. మునిసిపాలిటీ రద్దయిపోతుందేమోనన్న భయం ఆయన్ను ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా అడుగు ముందుకు వేయనీకున్నది. ఈపరిస్థితిని బిజెపివారు చక్కగా వాడుకుంటున్నారు. చివరికొచ్చేసరికి తెలుగుదేశం మూడవస్థానంలోకి దిగజారి, బిజెపి సెకండ్‌ప్లేస్ సాధించినా ఆశ్చర్యపడాల్సిందిలేదు. ★

## పంచాంగం

### మేనెల తిథులు

నిజ వైశాఖ శుక్ల-

| | | | | |
|---|---|---|---|---|
| 18 శని | పంచమి | రా 11.00 | గం. వ. |
| 19 ఆది | షష్ఠి | రా 8.45 | ,, |
| 20 సోమ | సప్తమి | రా 6.40 | ,, |
| 21 మంగళ | అష్టమి | సా 4.50 | ,, |
| 22 బుధ | నవమి | సా 3.25 | ,, |
| 23 గురు | దశమి | ప 2.15 | ,, |
| 24 శుక్ర | ఏకాదశి | ప 1.40 | ,, |

-స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ. ★

డయనోరా అవార్డుల సభలో నిప్పో మేనేజింగ్ డైరెక్టరు శ్రీ పి. ఓబులరెడ్డి, శైలేంద్ర, రజనీకాంత్, కమల్‌హాసన్.

# అవార్డుల ప్రదానంతో ఉత్తమచిత్రాలకు ప్రేరణ

'సినిమారంగంలో అత్యుత్తమమైన ప్రతిభను ప్రదర్శించినవారికి గౌరవ పురస్కారాలను అందజేయడంద్వారా మహోన్నతమైన చిత్రాల నిర్మాణానికి ప్రేరణ కలిగించినట్లవుతుంది,'' అన్నారు ప్రముఖ పారిశ్రామికవేత్త, సాహిత్య పోషకులు, డైనోవిజన్‌లిమిటెడ్ వ్యవస్థాపక డైరెక్టర్ శ్రీ పి. ఓబుల్‌రెడ్డి తన గంభీరమైన ప్రసంగంలో. ఆయన ప్రధాన వక్తగా 'డయనోరా' కో స్పాన్సర్‌షిప్‌తో మే 4 నాయంత్రం మద్రాసు యూనివర్శిటీ సెంటినరీహాలులో ''సినిమా ఎక్స్‌ప్రెస్'' 1990 అవార్డులవేడుక కన్నులపండువుగా వినూత్నంగా జరిగింది. కాళాత్మకంగా, వాణిజ్యపరంగా, అన్నివిధాలా ఎంతో ఎత్తుగావున్న శ్రీ ఓబుల్‌రెడ్డి పర్యవేక్షణలో సకాలంతరణ ఏర్పాట్లు భారీ ఎత్తున జరిగాయి. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ చిత్రాలలో ఉత్తమ కళాకారులకు, సాంకేతికనిపుణులకు దర్శకనిర్మాతలకు, అవార్డులు ఇవ్వబడ్డ ఈ సభలో తెలుగు చిత్రాలకు హీరో డాక్టర్ రాజశేఖర్, హీరోయిన్ విజయశాంతి, డైరెక్టర్ ఎ. మోహనగాంధి అవార్డులు అందుకున్నారు. విశిష్టమైన సేవలు అందజేసిన వారికి 1987 నుంచి డయనోరా సంస్థ ప్రదానంచేసే 'సినీ గోల్డ్' అవార్డు లు ఈమారు సంగీత దర్శకుడు కె. వి. మహదేవన్, మలయాళనటుడు, దర్శకుడు మధు, తమిళ నటుడు శైలేంద్ర లకు శ్రీ ఓబుల్‌రెడ్డి అందజేశారు. కమలహాసన్ అధ్యక్షతవహించిన ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన రజనీకాంత్ ప్రసంగం, సాంస్కృతిక ప్రదర్శనలు, నటి గౌతమి వ్యాఖ్యానంతోపాటు 'డయనోరా' కో స్పాన్సర్‌షిప్ అదనపు ఆకర్షణ అని ఆనాడు ఆ వేడుకకు హాజరైన అసంఖ్యాక రసజ్ఞుల అభిప్రాయం.

### దక్షిణభాషా చిత్రాలకు నిప్పో ఓబులరెడ్డి డయనోరా అవార్డులు!

### నెల్లూరీయుల చిత్రంలో శ్రీదేవి

''విముక్తి'' అనంతరం టి. వెంకటసుబ్బయ్య సమర్పించే టి. వి. ఎస్. ఫిలిమ్స్ ''ద్రౌపది'' చిత్రంలో శ్రీదేవి ప్రధాన పాత్రధారిణి దర్శకత్వం: కమలాకర కామేశ్వరరావు, నిర్మాత: టి. అశోక్‌కుమార్, నిర్వహణ: టి. నరేష్ కుమార్, దారాకాలంతర్వాత ప్రేక్షకులకు ఒక చక్కని పౌరాణిక చిత్రాన్ని అందించే నిర్మాతలు ఎంతైనా అభినందనీయులు. ఈ చిత్రం అత్యంత భారీగా తయారవుతుంది.

—తరువ 11 పేజీలో

## వినోదం, విజ్ఞానం సమంగా పంచిన మంచి చిత్రం

# అశ్వని

### చిత్ర సమీక్ష
★
గ్రిద్దలూరు గోపాలరావు

ఈ పర్యాయం ఉషాకిరణ్ మూవీస్ సంస్థ క్రీడారంగాన్ని కథావస్తువుగా తీసుకొని ''అశ్వని'' చిత్రం నిర్మించింది. పరుగుపందాలకు సంబంధించిన క్రీడ ఇందులో ముఖ్యఅంశంగావుంది. ఇందులో ఒక ముఖ్యమైన విశేషముంది. అదేమంటే పరుగుపందాలకు చెందిన ఈ చిత్రంలో హీరోయిన్‌గా ప్రసిద్ధ పరుగుపందాల క్రీడాకారిణి అశ్వని నాచప్ప నటించడం. ఈ చిత్రంలో ని హీరోయిన్ పరుగుపందాల రాణి కావటం, ఆ పాత్రను- అగ్రశ్రేణి పరుగుపందాల క్రీడాకారిణి అశ్వని నాచప్ప పోషించటంతో ఆ పాత్రకు ఒక విశిష్టత ఏర్పడింది. ఆ పాత్రను పోషించడం అశ్వనినాచప్పకు సులభమైంది. ఆమె స్పోర్ట్స్ స్టార్‌గానేగాక, సినిమా స్టార్‌గా కూడా ఈ చిత్రంలో గొప్పగా రాణించింది.

అశ్వని నాచప్ప తన నిజజీవితంలో అరేళ్ళవయసులో తనతల్లి సహకారంతో పరుగుతియ్యటం ప్రారంభించింది. పట్టుదలతో, దీక్షాదక్షతలతో ఒక ధ్యేయంతో పరుగుక్రీడలో ఆమె ఒక అగ్రస్థానం సంపాదించింది. ప్రపంచ ఛాంపియన్ పి. టి. ఉషపై గెలుపు సాధించడమంటే మాటలుకాదు. దాన్ని చేతల్లో చూపింది నాచప్ప ఇప్పుడు ఆమె ధ్యేయమొక్కటే. వరల్డ్ ఛాంపియన్‌లో ప్రథమస్థానం సంపాదించి స్వర్ణపతకం చేజిక్కించుకోవాలన్నది! ఈ ధ్యేయంకోసం ఆమె అవిరళ కృషి సాగిస్తూంది. బెంగుళూరు విజయా బ్యాంక్‌లో ఉద్యోగంచేస్తూవున్నా ఆమె ధ్యానమంతా వరల్డ్ ఛాంపియన్‌షిప్ మీదే లగ్నమైవుంది.

'అశ్వని' చిత్రానికి సంబంధించిన కథను నాచప్ప నిజజీవితంలోని కొన్ని అంశాలకు కొంతం సామ్యంగా వ్రాశారు. పరుగుల క్రీడాకారిణిగా నిజజీవితంలో ఆమె ఏ ధ్యేయంకోసం కృషిచేస్తూందో ఆ ధ్యేయంతోనే ఈ చిత్రంలో కథానాయిక కృషిచేస్తుంది. ఈ చిత్రంలో ని కథానాయిక అశ్వనిపాత్ర నాచప్ప నిజజీవితయాత్ర ఒకదానిని పిస్తుంది.

ఈ చిత్రంలోని కథానాయిక అశ్వని చిన్నప్పుడు ఒక పేదపిల్ల. చిలిపి పిల్ల. దొంగపిల్ల. చిన్న చిన్న దొంగతనాలు చేస్తూ ఎవరికంటా పడకుండా జోరుగా పరుగుతీస్తుంటుంది. పొట్టనింపుకుంటూ వుంటుంది పరుగుపందాల్లో ఆరితేరిన ప్రభాకర్ (భానుచందర్) అనే యువకుడి పాంప్లెకెట్‌ను ఒకరోజు అశ్వని దొంగలించి పరుగు లంకిస్తుంది. ప్రభాకర్ ఆ అమ్మాయి పరుగు అందుకోలేకపోలాడు పరుగెత్తటంలోని ఆ అమ్మాయి శక్తినిగుర్తించిన ప్రభాకర్ ఆమెను పరుగు క్రీడలో తిరుగులేనిదానిగా తయారు చెయ్యాలనుకుంటాడు. ఆమెకు తర్ఫీదిస్తాడు. అనేక పరుగుపోటీలలో పాల్గొని గెలుపొందేస్థాయికి తీసుకొస్తాడు. చివరకు పి. టి. ఉషలాంటి ఛాంపియన్ను ఓడిస్తుంది స్వర్ణపతకం పొందుతుంది.

కథావస్తువు పరుగుక్రీడలకు సంబంధించినా, దానితోనె బోరుకొట్టకుండా ఆట, పాట, ఫైట్లు, మంచి హాస్యము జతపరచి అహ్లాదం కలిగించారు దర్శకుడు మౌళి. ఇలా వినోదం అందిస్తూనే క్రీడలకు సంబంధించిన విజ్ఞానాన్నికూడా పొందుపరిచారు. క్రీడలకు సంబంధించిన ఆదర్శాలు, ఆశయాలు సిద్ధాంతాలు, ఉన్నతస్థాయికి ఎదిగేందుకు అవసరమైన పట్టుదల, కృషి, వృత్తిరీత్యా ఈర్ష్య, వైషమ్యాలు, క్రీడారంగంలో రాజకీయాలు, క్రీడాకారులు కృత్రిమసామర్థ్యం పొందేందుకు మాదక ద్రవ్యాలు సేవించటం, ఈ మోసాన్ని గుర్తించి అలాంటి క్రీడాకారులను బహిష్కరించటం ఇలాంటి విషయాలను చాలా బహిర్గతంచేశారు. క్రీడాకారులకు తర్ఫీదు నిచ్చే కోచ్‌ల కథనంకూడా విపులంగా చూపారు.

పరుగు పందాల్లో తన ధ్యేయసాధన కోసం అశ్వని సాగించే అవిరామ శిక్షణ కృషిని ''సానపట్టు పట్టకుంటే అదొట్టి రాయిరా''- వేటూరి వ్రాసిన ఈ పాట నేపథ్యంలో చాలా ఆకర్షణీయంగా చిత్రీకరించారు. ఈ దృశ్యాలు యువతను ఉత్తేజపరచి వెంటనే క్రీడారంగంలోకి దుమికించేంత ఉత్సాహంగా వున్నాయి. నాచప్ప పరుగుతీసేటప్పుడు ఒక అంగకు మరో అంగకు దూరం ఎనిమిది అడుగులుంటుందట. అంత వేగంతో కూడుకున్న ఆ పరుగును పి. యస్. ప్రకాష్ కెమెరా అందుకొని సర్వాంగ సుందరంగాచూపింది. ఈ చిత్రానికి నాచప్ప శరీరసౌష్టవం ఒక ప్రత్యేక ఆకర్షణ.

నాచప్ప మంచి నటికూడా అనిపించుకుంది చిలిపిచేష్టల దృశ్యాల్లో గిలిగింతలు పెట్టింది. తన నిర్లక్ష్యంమూలంగా తల్లి గుండె ఆగి చనిపోయినప్పుడు గుండెలు పగిలేంత దిగులుచూపింది. ప్రభాకర్ వస్తుంటూ తవకతిండి పెట్టి శిక్షణ ఇస్తున్నారని తెలుసుకున్నప్పుడు అంతవరకు చిలిపిగావున్న అశ్వనిలో పెంగివగాంభీర్యం, పట్టుదలం, నాచప్ప గొప్పగా చూపింది. దీక్ష, పట్టుదల, కృషి వుందే దేనినైనా సాధించి అగ్రస్థానం పొందవచ్చని అటు

—తరువ 11 వ పేజీలో

# పినాకినీతీరం

(2 వ పేజీ తరువాయి)

గాంధీ మాత్రం ఆ పాత లెక్కనే పట్టుకొని వున్నారు. ఈ వారంలో కూడా ఆయన హైదరాబాదులో పత్రికలవారితో మాట్లాడుతూ ఆంధ్రలో సీట్లు తగ్గవచ్చునని అన్నారు. ఆయననిజంగా ఆవిధంగానేభావించి వుండవచ్చు. కాని పార్టీ ప్రచారానికివచ్చి పార్టీకార్యకర్తలనునిరుత్సాహపరిచే మాటలు పార్టీ అధినేత పల్కడం ఏమిటి అని కాంగ్రెస్ వాదులు విస్తుపోతున్నారు. పార్టీకి అంతకంటే నష్టం కల్గించేమాట రాష్ట్రంలో కాంతిభద్రతల పరిస్థితి క్షీణించిందని వ్యాఖ్యానించడం! ఎం. ఎల్. ఏ. చెన్నారెడ్డి హత్య, సుధీర్‌కుమార్ అపహరణ సంఘటనలను దృష్టిలో పెట్టుకొని ఆయన ఆ వ్యాఖ్య చేసివుండవచ్చు. ఎన్నికల ప్రచారంలో ప్రతిపక్షాలవారు చేసే విమర్శలను కాంగ్రెస్ అధ్యక్షుడు రాజీవ్ గాంధీయే చేయడం ఏం బాగు అని కాంగ్రెస్ వాదులు తమలో తాము మదన పడుతున్నారు. ముఖ్యమంత్రిని ప్రక్కన పెట్టుకొని ఆయన ఈవిధంగా వ్యాఖ్యానించడంలోని వుద్దేశ్యమేమిటి అని వారు ప్రశ్నించుకుంటున్నారు. ఏమైనా క్లిష్ట సమయంలో ముఖ్యమంత్రిని సంకటస్థితిలో పెట్టే మాటలివి. సందేహంలేదు!

కాంగ్రెస్ అంతర్గత విభేదాలు, పార్టీ విద్రోహచర్యలు ముఖ్యమంత్రికి తలనొప్పికల్గిస్తున్న పెద్దసమస్య. శ్రీకాకుళం మొదలు చిత్తూరువరకు ఎక్కువ తక్కువ తేడాతో అన్నిచోట్లా వున్న సమస్య ఇది. కాంగ్రెస్ సంస్కృతికి భిన్నమైనదికాదను కోండి! వుత్తప్పుడు తన్నుకొని తలకలు పోసుకున్నా, ఒకరినెత్తిన ఒకరు దుమ్ము దులుపుకున్నా, ఒకరి మొహాన ఒకరు బురదచల్లుకున్నా ఎన్నికల నాలుగు రోజులైనా ఏకంగా వుండడం అవసరమనే ఇంగితజ్ఞానంకూడా కాంగ్రెస్ వాదులకు లేకుండాపోతున్నది. కాంగ్రెస్ పార్టీ బ్రతుకుతో తమ రాజకీయ బ్రతుకు ఆధారపడివున్నదనే స్పృహవుంటే ఏ కాంగ్రెస వాదీ తప్పుచేయరు. విభేదాలుంటే, కక్షలు కార్పణ్యాలుంటే, పంతాలు పట్టింపులుంటే ఎన్నికలలో పార్టీకి విజయం చేకూర్చి ఆ పిమ్మట తేల్చుకోవచ్చు. ఓటమి తర్వాత జరుగుతున్న ఎన్నికలలోకూడా కాంగ్రెస్ వాదులలో జ్ఞానోదయం కలుగనందువల్లనే వాతావరణం పార్టీకి అనుకూలంగా వున్నా దాన్ని పూర్తిగా వుపయోగించుకొని ప్రయోజనం పొందలేకపోతున్నారు.

రాష్ట్రంలో కాంగ్రెస్ జయాపజయాలు ఒక పరీక్ష అయితే, ఒంగోలు - నెల్లూరు నియోజకవర్గాలు జనార్ధనరెడ్డికి వ్యక్తిగతంగా అగ్నిపరీక్షలాంటివి. ఆయన పదవి ప్రతిష్టంకే కాదు, ఆయన రాజకీయ భవిష్యత్తుకుకూడా ఏటి ఫలితాలు గీటురాళ్ళు. ఆయనకొక్కడికనే ఎందుకనారి ఆయనవల్ల వలుకుబడి ప్రాబల్యాను అనుభవిస్తున్న ప్రతి కాంగ్రెస్‌వాది భవిష్యత్తుకు ఏటి ఫలితాలు — ముఖ్యంగా నెల్లూరు ఫలితం—పరీక్షే! నెల్లూరని ప్రత్యేకంగా ఎందుకు పేర్కొంటున్నానంటే ఒంగోలు పరిస్థితివేరు. అక్కడ పోటీ తీవ్రాతితీవ్రంగావుంది. కాని ఎంతటి తీవ్రమైన పోటీనైనా ఎదుర్కొని గెలువగలిగిన కాంగ్రెస్ అభ్యర్థి ఆ నియోజకవర్గానికిలభించాడు. దేవుడు పెళ్ళికి అందరూ పెద్దలే అన్నట్లు, ఒంగోలు కాంగ్రెసు అభ్యర్థికి అండగా నెల్లూరునుండి ఎవరంతట వారుగా వెలసపోతున్నారు. కాని నెల్లూరు పరిస్థితివేరు. అది ఎస్. సి. నియోజకవర్గం కావడం ఒక అననుకూలమైతే, కాంగ్రెస్ నాయకులు ముక్కచెక్కలై తరహాలోవుండడం మరొక అననుకూలత. తెలుగుదేశం పరిస్థితికూడా అంతే. ఇదే అదననుకొని బి. జె. పి. ప్రచారపు హోరు ఎక్కువచేసింది. దీని ప్రభావం ఓట్ల మీద ఎంతవరకు వుంటుందనేది వేరే ప్రశ్న. అప్రియమైన అభిప్రాయంలేని మామూలు ప్రజలమీద కొంతైనా అది తప్పకుండా వుంటుంది. గెలుపోటములనే తీరూలో కాంగ్రెస్ నాయకులు నిమ్మకు నీరెత్తినట్లువున్నట్లుంది. ఎన్నికలలో అటువంటి ప్రమత్తత ప్రమాదకరం. ప్రస్తుతం కాంగ్రెస్ వాదుల నిరాసక్తతవల్ల నష్టం ఏదైనా జరిగితే అది నేరుగా జనార్దనరెడ్డి గారికే! ఆయన శ్రేయస్సును ఏ మాత్రం కాంక్షించేవారైనా వుపేక్షించకూడదు.

అందువల్లనే ముఖ్యమంత్రిగా అందరి మన్ననలు పొందే సమయంలో హఠాత్తుగా వచ్చిపడిన మధ్యంతర ఎన్నికలు ఆయనకు పరీక్షాసమయంగా పరిణమించిందని అనడం! కాని మనజిల్లాకు చెందిన మూడు నియోజకవర్గాలు కాంగ్రెస్‌కు రావటమే కాదు, రాష్ట్రమంతటా కూడా పరిస్థితి అంత నిరాశాజనకంగాలేదని, దరిదాపుగా ముప్పయ్ స్థానాలకు తక్కువలేకుండా కాంగ్రెస్‌కు రావచ్చునని అంటున్నారు. దేశవ్యాప్తంగా కూడా కాంగ్రెస్‌కు మెజారిటీ రావచ్చునో, పూర్తి మెజారిటీకి సమీపంగా రావచ్చునో జరగవచ్చుననే వూహాగానాలు జరుగుతున్నాయి. ఈ పరీక్షా సమయం జనార్దనరెడ్డికి విజయవంతంగా గడచిపోతే మధ్యంతర ఎన్నికలు ముఖ్యమంత్రిగా ఆయనకు పునర్జన్మనిస్తాయి; ఆయన ఏలేవ ప్రాభవానికి వరప్రసాదం అవుతాయి!

NJL

రచ్చలమయమైన
రాజకీయ వనాన
ఎగిరివచ్చి వాలిన
"శాంతికపోతం"

# శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి

ఆయన గెలవాలి!
ఒంగోలు నియోజకవర్గంలో
నవశకారంభం కావాలి!!

సమ్‌తింగ్ స్పెషల్
పినాకిని సూపర్ మార్కెట్-నెల్లూరు.

శ్రీ శక్తి అగ్రో ఆయిల్స్ ప్రైవేట్ లిమిటెడ్
పొట్టెపాళెం-నెల్లూరు.